# ఇల్లాలు ఉసురు

రచయిత:

యర్రా వెంకటకృష్ణారావు



పి. వి. రామయ్య అండ్ సన్

రాజమండ్రి.



[ వెల 0—8—0.

# సూచన

ఇల్లాలను అనేకకష్టాలుపెట్టి తనడబ్బంతా, తాను ఉంచుకొన్న, వేశ్యకు, అర్పించాడు.

పాపదేవతకు తనజ్ఞానాన్ని, నయివేద్యంగా చెల్లించాడు.

క్రికి, వేశ్యచే— తనకళ్ళల్లో, కారప్పొడికూడా పోయించుకున్నాడు.

ఈప్రపంచములో, ఈవ్యక్తికి, ఇల్లాలుగాకపోతే— ఇంకెవరు దిక్కు—?

ఇట్లు,
రచయిత.

అమ్మా నాన్నగా రెక్కడున్నారు? అని నాచిట్టితండ్రి వచ్చి రానిమాటలతో అడుగుతూఉంటే—

నాకేమి చెప్పాలో తెలిసేదికాదు. నాజీవితము గొప్పదయినటు వంటి గాలితుఫానులోపడి అదుపులేకుండా ఎటో పోవుచున్నట్లుగ తోచెడిది. నాకన్నులనుండి వచ్చుచున్న నీటిప్రవాహమునకు అడ్డు వేయుదలచుకొంటినిగాని—ఆ నా ప్రయత్నము సఫలమయ్యెడిదికాదు.

నాగద్గదత్వముచూచి నాచిట్టిపాపడు బోరున యేడుస్తూ ఉంటే—

నామనస్సు ఘూర్ణిల్లి—నాదుఃఖ మధికమయ్యేది.

నాజీవితానకు యెటుచూచినను దారి కనుపించెడిదికాదు. అట్టి కష్టావస్థను నివారించెడిదాత లెవ్వరునూ కనుపించరైరి.

పరాత్పరా! పరంధామా! నీవేలనో యీదీనురాలను ఇటు విడిచి నాపతి నచరించెడి దుర్మార్గప్రవర్తనలనుండి విముఖునిగా జేసి నాపతిని నాకర్పించవా? దిక్కులేనిదానను హృదయఘోషతో నా దీనాలాపములు వినుచున్న నీకు నాపై కనికరము లేదా? ఎల్లప్పుడునూ నీపాదద్వయమును నాహృదయమున నిడుకొని పూజచేయుచున్న అకల్మషురాలను. అట్టి నన్ను కష్టములపాలుచేయుట న్యాయమా?

దీనబాంధవా! ఆపత్తులయందు నాభక్తులను రక్షించెదనని చేతికంకణముకట్టుకొంటివట. మధుసూదనా! ఆపదలోనున్న నీభక్తురాలను నన్నుకాపాడ సమయమిదే — అని భగవంతునిగూర్చి వేడుకొనుచుండగా—

అపరాత్రమునకు నాపయుని జాలికలిగి నాకష్టములను మటు మాయము చేయుచుండెనన్న మాదిరిని నాపతి వీధితలుపులు గొంటు కొని లోనికివచ్చెను.

ఆలని ఆకారము, ఆవేళకు ఏబదిరోజులయింది చూచి—

ఆసమయాన్ని నేనుపొందిన ఆనందం వర్ణనాతీతం!

నా నాలుగువత్సరముల చంద్రుడూ, వడివడిగా నాన్నగారి దగ్గరకువెళ్ళి—

నాన్నగారూ! బొమ్మ లేవీ మిఠాయి తేలేదూ? అని ఆతురదగా అడగ్గా—

ఆముద్దుపలుకులువిని నవ్వుకుంటూ అక్కరిసను సంకనిడు కొని అక్కడనేకూర్చొని ఆనందమనుభవించుచున్న నాదగ్గరకొచ్చి—

అననూయా! అని ప్రేమ యుట్టిపడపిలచి నాచేయిపట్టుకొని లేవదీసెను.

నేటితో నాకష్టములు తీరిపోయినవి. నాజన్మ సార్థకమయ్యె నని, నామనస్సులో పొంగిపోవుచూ—ఆనందాంబుధిని డోలలాడితిని. నాప్రాణవల్లభునకు ఇష్టములయిన పదార్థములను నామనస్సులో యూహించుకొని ఒక అరగంటటయిములో వంటకములను తయారు జేసి—ఆయన స్నానము చేయుటకు కొన్ని వేడినీళ్ళను తోడితిని.

ఆయన స్నానము జేసి, నేనువడ్డించిన పదార్థములను భుజించెను.

అనంతరము నేనునూ—నాచంద్రుడునూ, భుజించితిమి. అప్పటికి సూర్యుడపరాత్రికేగి రెండు గంటలాయెను. ఆవేళ పౌర్ణమి—అవటంవలన పిండారబోసినట్టు వెన్నెలకాయుచుండెను. చంద్రునుని తేజస్సు, మాఇంటికి పశ్చిమభాగమున నున్న దొడ్డియందు వినోదార్థము పెంచుకున్న కర్పూర చామంతిచెట్లవము, సోయగముగా ప్రకాశించు చుండెను.

నేనా చామంతి పువ్వులను, కొన్నింటిని కోసుకొని, ఆనందముతో — ఆపువ్వులను ఒక మాలగా జేసుకొని ధరించుకొంటిని. ఇంతలో నామనోహరుడు అనసూయాయని పిలువగా — ? నేనక్కడకు వెళ్ళి ఏమండీ అని నిలుచున్నాను.

మా చంద్రుడు నిద్రిస్తున్నాడు అని ఆయన అనగా — నిద్రించుచున్న మా చంద్రుని చేయి జేపట్టుచూ ఆయన కూర్చుండి యున్న పందిరిపట్టి మంచం ప్రక్కగా ఉన్న పడకమంచంపయిని పరుండ బెట్టితిని.

నాకాసమయమున, నాపతితో, నాపతితో, నాకష్టసుఖము లన్నీ — ఒక్కసారిగా, చెప్పుకొనవలెయునని తోచింది. ఎందులకోగాని నాహృదయమునకు, తొందర జనించినది. ఆనాయవస్థలో, నామోమున పట్టిన చిరుచెమటలు, ముత్యములవలె ఒక్కొక్క, బిందువు ఫాలము వదలి క్రిందికి జారిపోవుచుండెను—

అట్టి నాస్థితిని జూచి, నాప్రాణసఖుడే మనుకొనెనోగాని, ప్రేమ రసపూరితము లైన వాక్యములతో — నన్ను సంతుష్టురాలుగా జేసి అతని మృదుహస్తమున నాపయిట చెంగు అందుకొని నన్నాతని చెంతకు జేర, బిలుచుకొని—

అనసూయా? నీకు నేను గావించిన, అపరాధములను మన్నించి నన్ను క్షమించవా?—

అని బ్రతిమాలుకొనగా—

ఏమండీ మిమ్మల్ని క్షమించటానికి, నాకర్హత లేదు. అట్టి అపచారాలయినా, నన్ను మీరు క్షమించమని కోరుకొనుట న్యాయము కాదు. మీరట్లు కోరినా మనస్సునకు పరితాపమయిన బాధ కల్పించితిరి.

అనసూయా!— నీమనస్సునకు, బాధ కల్పించ వలయునని కల్పించలేదు నీ వూరకుండుము— అని నాప్రాణసఖుడు నన్నొక ముద్దుగొని కౌగలించుకొనెను.

నాకు అప్పటి కౌగిలి స్వర్గీయానందము నొసంగినది. ఆక్షణమున ప్రపంచమును మరచి ఆనందాంబుధిని ఓలలాడితిని. స్వామివారిని కృపకు పాత్రురాలను అయితినిగదాయని మురిసిపోతిని నాలో ప్రేమజ్యోతి జ్వాజ్వల్యమానముగా వెలిగినది. ఆ ఆనందములో హే కృష్ణభగవాన్ నీదాసురాలపై కటాక్షవీక్షణములు ప్రసరింపజేసితివి దయామయా అని భగవానుని లోలోన ధ్యానించుకొంటిని.

ఆనాటి అర్ధరాత్రివరకూ ఆనందముతో గడిపి మేమిరువురమూ నిద్రించితిమి—

అని అనసూయ స్నేహితురాలయిన అరుంధతితో చెబుతూ ఉంటే—

చెప్పేకొద్దీ వినవలయునని కుతూహలంతో వింటుంది అరుంధతి.

ఇంతలో అనసూయతల్లి సీతామహాదేవమ్మగారు అక్కడకొచ్చి—

అనసూయా! పొద్దుపోయిందమ్మా భోజనానికి లే.

అమ్మా! నాకీపూట ఆకలవటం లేదు. అన్నం తినను.

అనసూయా! రోజూ అలాఅంటే ఎలాగమ్మా. నువ్విక్కడకొచ్చి పదిహేను రోజులయింది. ఒకపూటగాకపోతే ఒకపూటయినా సరిగ్గా అన్నహారాలు ముట్టకున్నావు! మనస్సులో బెంగపెట్టుకొని ఆఖరికి నీశరీరాన్ని పాడుచేసుకుంటున్నావు.

పొద్దుట తమ్ముడున్నూ, నువ్వూ చంద్రుడుకలిసి తోసివేస్తే యేనాడో నీవీపూట అన్నంమానేస్తే నేనుకూడా అన్నంతినను.

అని ఆ వృద్ధ వితంతువు దీనంగా అంది.

అనసూయ తన మనస్సులో ఏమనుకుందోగాని పోతూనే—

స్నేహితురాలయిన అరుంధతితో అన్నంతిని వస్తానని చెప్పగా—

అరుంధతికూడా అనసూయదగ్గర సెలవుతీసుకుని మరలవస్తానని చెప్పి వెళ్ళిపోయింది.

ఇంతలో అనసూయతమ్ముడు చేత్తో టిఫిన్‌కాఫీపొట్లాం పట్టుకుని చంద్రునితోకలిసి వీధిలోనుంచి రాగా—

సత్యం నీకోరకే యెదురుచూస్తూ ఉన్నానంటూ—

సీతామహాదేవమ్మ వారిద్దరను భోజనాలకోసము వంటగది లోనికి తీసుకెళ్ళింది.



అనసూయా! తరువాత ఏగాథ, వినవలయునని, నామనస్సు తత్తరపడుచున్నది. మీయొక్క వృత్తాంతమేమి జరిగెనని—

అనసూయను తనజీవితగాథను, చెప్పుమని అరుంధతి ప్రోత్సహింపగా—

"అరుంధతమ్మా? నాజీవితగాథ ఘోరమయినది— నేనొకనాడు, తెల్లవారుజామున మేల్కొంచితిని. మేముపడుకున్నగదిలో వెలిగేదీపం, ఆరిపోయింది. అంతా చీకటిగాఉంది. మాఅయన్ని అగ్గిపెట్టె అడిగి పుచ్చుకొని దీపం వెలిగించాలని. ఆ చీకటిలోనే మంచంమీద మాఆయన్ని చేత్తోతడుముగా—మాఅయన నాకు కనుపించలేదు. వెంటనే నేను లేచి అలమారులోఉన్న మరో అగ్గిపెట్టెని, తీసి దీపం వెలిగించాను.

ప్రక్కనేతమంచంపయిని నిద్రించుచున్న చంద్రునివయిపు చూడగా—చంద్రునిచేతియుంగరమూ, నాకంఠమునయున్న అమూల్య కాసులగొలుసునూ నాకు కనుపించినవి కావు. నామనస్సు చలించినది, నేనదియొక కలగా భావించితిని. దిగ్భ్రమచెందిన నాఆశ్చర్యము [illegible] పోయింది."

అని భగవంతునిగూర్చి అనేకవిధములుగా ప్రార్థించుకొని పరలోకమును వెళ్ళుటకు సిద్ధముగా నుంటిని.

'ఎటుందదలమ్మా? ఆసమయమున నాచంద్రిక నాకన్నుల కగుపడెను.

నిద్రించుచున్న నాచంద్రిక కన్నులకరవుదీర చూచుకొంటిని. బొటబొట నానయనములనుండి విషాదజలము ప్రవహింపసాగెను.

'అనసూయా! నీ వాచరించెడిపని దుర్మార్గమైనది. నీచకార్య మునేయ ప్రాల్పడుచుంటివి. జ్ఞానమునువిడచి నింద్యాస్పదమైన కార్య మునకు ఒడంబడితివా? నీ వాచరించెడి ఘోరకార్యము నరకమునకు త్రోవ——

అని నాకెవరో చెప్పినట్లాయెను. నామనస్సు భయపడింది. నాలో వెర్రియూహలు జనించినవి. నిద్రించుచున్న నాచంద్రిక మెలుకువజెందె——

'అమ్మా! అమ్మా!'' అనుచూ మంచం తడుముకొనుచూ—— నేను కానరానందున ఏడువసాగెను.

నాకంఠమునయున్న యురిని కంగారుగా తీసుకొని ఏడ్చుచున్న నాముద్దుబిడ్డను ఎత్తుకొని నాతనయుని కన్నీళ్ళను తుడిచి ఊరడించి నిద్రింపజేసితిని

అప్పటికింకనూ తెల్లవారుటకు రెండుగడియలకాలమున్నది. నా చంద్రిక నిద్రించుచున్న మంచంపయినికూర్చొని దీర్ఘాలోచనచేయ దొడంగితిని——

నాకేమియూతోచినదికాదు. నాయూలోచనలకు విఘ్నములు సంభవించుచుండెను. నాభర్త వ్రాసినఉత్తరము మరల జ్ఞప్తికివచ్చి మనస్సు అపరిమితమైన బాధపడింది. అదృష్టహీనురాలైన అన సూయా? యని నాపతివ్రాసినవాక్యము గుండెయందులో గ్రుచ్చుకొని గాయముగా మారెనది.

భగవానుడా! నాపతికి నేనుకాపాడించిన అపరాధము లెవ్వియును లేవు. పతికి నాయందు దయ లేకపోవుటకు కారణమేమి?

నాపతిపాదములను సర్వకాలసర్వావస్థలయందునూ—నాహృదయమున నిడుకొని పూజించుకొనుచున్న అకల్మషహృదయను. అట్టినాయందు నాపతికి దయలేకపోవుటకు హేతువేమి? కాని నాపతివ్రతకు ఫలితము లేకపోయెను.

నాకవితెద్భుత్వము నాకెన్నులు కనుపడి నామనస్సు భయపడింది.

ఈనటన నిజమా స్వప్నమా యనుసు, సంశయాన్పదనయితిని—

ఇంతలో కస్తుటములు, కొక్కురోకూయని, కూసినవి. వీధివాకిళ్లు తుడిచే చప్పుడు—వినిపించింది.

మాఇంటి, చాకిరీచేసే, అప్పలమ్మ—

'అనసూయమ్మగారూ? వీధితలుపు తీయండి'—అని నన్ను పిలిచింది.

'వస్తున్నానుండు—అప్పలమ్మా!' అని, వెంటనే లేచి—వీధితలుపు తీయడానికి, వెళ్ళుచుండగా—

వీధితలుపులు గెంటుకొని, అప్పలమ్మ నాకెదురొచ్చి—

'అమ్మగారూ? వీధితలుపులు వేయటం, మరిచిపోయారా? తలుపులుమీద, చేయివేయటంతోనే—మీరు తలుపులు వేయకపోవటంవలన, వచ్చేశాయి.' అని అప్పలమ్మ అనగా—

అప్పలమ్మకు నేనేమీ సమాధానమివ్వలేదు.

మరల నాభర్త స్వజ్ఞప్తికవచ్చి—వ్యాకులతతోనున్న నామనస్సును మరింత వ్యాకులతగా జేసెను.

నాభర్త వెళ్ళిపోయేటప్పుడు తీసుకుని—వెళ్ళిన వీధితలుపు అప్పలమ్మ చెప్పుతేనేగాని నాకు స్ఫురించలేదు.

అప్పలమ్మ యథావిధిగా చేసే పనులను ఆరోజున పెందలాడే చేసి—మాయింటికి ఉత్తరభాగమునయున్న వసారాలో విచారముతో— తుంగచాపమీదకూర్చునియున్న నన్నుజూచి వెలవెలబోయింది.

నిద్రించుచున్న నాచంద్రుడు మేల్కాంచి—

'అమ్మా? అమ్మా?' అంటూ—

అప్పలమ్మా—నేనూ— కూర్చునియున్న వసారాలోనికివచ్చి నా వళ్ళోకూచుని—'అమ్మా? నాన్నగారేరీ? అని నన్ను అడిగెను

నాచిట్టితండ్రి నన్ను అలా అడుగుతూ—ఉంటే—

అప్పలమ్మ మరింత తెల్లబోయి—

'అనసూయమ్మా? మూలసందబాబయ్యగారు రాలేదా? అని అదురదాగా అడిగింది.

'అనసూయమ్మా?' అప్పలమ్మ ఒకపేదరాలు. ఆమె విశ్వాసనీయురాలు. అప్పలమ్మకు అరువదిసంవత్సరములుండును. ఆమె ఏబదోయేట భర్త మృతిపొందెను. ఆమెకు ఇక ఎవ్వరునూ లేరు. ఆమె నివసించుటకు మాయింటికి కొద్దిగాదూరములో—చిన్న పూరిల్లు మాత్రమున్నది.

అప్పలమ్మ మాయింటిచాకిరీచేయుచూ—తనజీవితం గడుపుకొనుచుండెను. అప్పలమ్మకు మాయందు మహాప్రీతి.

గతరాత్రిజరిగినచర్య అప్పలమ్మకు చెప్పగా—విని తనకళ్ళవెంబడి నీళ్ళను బొటబొటా వదలినది.

నాకుధైర్యంచెప్పే అప్పలమ్మ విచారిస్తుంటే—నా దుఃఖమింకా అధికమయ్యింది.

ఎట్టకేలకు మాఅప్పలమ్మ నన్ను ఓదార్చి—

'అనసూయమ్మా' విచారించకు పరికైయినసూ కష్టములొచ్చుచుండును. కష్టములు కలకాలముండవు. నీవు పతివ్రతవు—నీపతిపాదములను నీహృదయమున నిడుకొని ఎల్లప్పుడునూ పూజచేసుకొనుచున్న

పుణ్యాత్మురాలవు. అట్టివారియందు దయామయుడైన భగవానునకు కరుణరాకపోదు.

అని అనేకవిధములుగా అప్పలమ్మ నాకు ధైర్యముచెప్పి నన్ను ఊరడించింది.

అప్పలమ్మ నన్నువిడచి యొక్కనిముషమైననూ యుండెడిది కాదు. తనయింటిదగ్గరకువెళ్ళుటమాని మాయింటిదగ్గరనేయుండి నాకు ధైర్యంచెబుతూ యుండెడిది.

'అరుంధతమ్మా' నా నాథుని నిద్రావస్థయందునూ నామనసులో ధ్యానించుకొనుచు రోజు ఒకయుగమువలె గడుపుకొనుచు యుండెడిదానను.

అట్లాక పద్దెనిమిదిరోజులు గడచినవి. ఆనాడు అట్లతద్ది—

ఆరోజున నేను ఉపవాసముండి శాంభవీ; నాభర్తను నాకొసంగవా యని శంకరునిభార్యయైన ఉమాదేవిని—పూజించుకొంటిని. ఆనాటిరాత్రి పరుండబోవుసమయమున నానాథుని మనస్సులో ధ్యానించుకొని నిద్రించితిని. ఆనాడు అర్ధరాత్రిసమయమున అనసూయా యని ఎవరో బిగ్గరగా పిలిచినట్లాయెను.

ఆపిలుపు నానిద్రకు అంతరాయము కలిగెను.

తత్తరపాటుతో లేచి నేను పరున్నగదితలుపులను తీసుకుని చావడిలోనికి వెళ్ళి నిలవబడగా—

ఆచావడిలో నిద్రించుచున్న అప్పలమ్మ మెలుకువచెంది నన్ను చూచి—

'అనసూయమ్మా' ఆనందబాబయ్య నిమ్మల్ని పిలిచినట్లాయెను. అని నాతో మహాసంతోషంగా అంది.

ఇంతలో అనసూయా! తలుపుతీయుమని మళ్ళా మా ఆయన బిగ్గరగా పిలిచెను.

నడినడిగా నేను వెళ్ళి—వీధితలుపులు తీయగా—

నల్లటిదుస్తులతో నాభర్త నాకు కనుపించెను.

గుమ్మమెదుట నాలుగుగుర్రపుబండ్లు నిలబడియున్నవి.

ఆబళ్ళు యెందుకు అట్లునిలవబడియున్నవో నాకుఅర్థం కాలేదు.

వీధితలుపులు తీయటంతోనే నాభర్త రౌద్రాకారముతో లోనికివచ్చి—

'ఏమే?' అనసూయా? అని కఠినముగా పిలచెను.

నేనాతనిదగ్గరకు వెళ్ళి—నిలవబడితిని.

ఆయన నన్నుచూచే — ఆకఠినచూపులు నాహృదయమును ఛేదించినవి.

ఆయన తాగిన మత్తుపానీయముల వాసనభరింపలేక పోతిని. నాభయమగ్గలమయినది.

'గౌరీ.'' నిన్ను వేడుకొన్నందుకు ఫలితమిదియా?' అని గౌరిని లోలోన దూషించితిని.

ఇంతలో నాభర్త కర్ణకఠోరముగా—

'అనసూయా? యని—నాచేయి పట్టుకొని —ఈచేతి దేమిటి?

"గౌరిపూజా—సమయమున కట్టుకున్నతోరణం.'

"గౌరి అంటే ఎవరు? ఆగౌరికీనీకూ సంభంధముందా?'

గౌరిని పూజించుకుని, చేతికి మామిడాకుతోరణం కట్టుకున్నావా? అది నీకేమి ఉపకారం చేస్తుంది?' అని నాభర్త నన్ను గద్దించి అడగ్గా—

నేనేమీ సమాధాన మివ్వలేకపోయాను.

'పానపిచాచమా? నానాధునిజ్ఞానమును మాయముజేసి నానాధుని నోటినుండి ఇట్టివాక్యములు పలికించుట న్యాయమా?' అని పానపిచాచమును లోలోన బ్రతిమాలుకొంటిని.

అనసూయా? నీవునాకు అసూయరాలగా కనబడుచున్నావు. నేనడిగినమాటలకు సమాధానమిచ్చుటలేదు. దుర్మార్గురాలా? నీప్రాణములు నీకు దక్కవు జాగ్రత అని మరల నానాధుని నోటినుండి పలికించినది ఆపానపిశాచము.

ఆసమయమున నాశరీరం కంపించింది. నాకేమియూ తోచింది కాదు. నాభర్తకు నేను సమాధాన మెట్లీయవలెనో తెలియుటలేదు.

స్తంభించి చెర్రిదానివోలె నాభర్తవయిపుకుచూట్టంపారంభించేను

'సగర్వంగా నావయిపుకేచూస్తూ—నన్ను హేళనచేస్తున్నావా?' అని కళ్ళంట నిప్పులు గురిపిస్తూ—

చేతిలోనున్న ఆలావుపాటి ప్రేముబెత్తముతో, నాతల చిట్లిపోయేలాగున నన్నుకొట్టి బూటుకాలితో నన్నాయన తన్నగా—

నేను ఆచావడీలోనున్న మంచువాలో పడిపోయాను. ఈదృశ్యం చూస్తూఉన్న అప్పలమ్మ వడివడిగావెళ్ళి ఆముదమూ పసుగ్గూ కలిపి తీసుకొచ్చి చిట్లిపోయిన రక్తముకారుచున్న నాతలక్కు కట్టుకట్టి గొళ్ళున ఏడుస్తూ—

నన్ను నెమ్మదిగా లేవదీసి తనభుజంమీద వేసుకొని—నన్నొక మంచంమీద పరుండబెట్టింది.

ఆచావడీలోనే అటూఇటూ పచారుచేయుచూ నాభర్త రాక్షసాకారంతో నాకు ఉపచారములు చేయుచున్న అప్పలమ్మనుచూచి

అప్పలమ్మా! జాగ్రత నిన్ను యమలోకానికి పంపెదను అని పళ్ళు నొలుకుతూ—

తనమొలయందున్న పదునయిన కైజారునుతీసి అప్పలమ్మ దగ్గరకు వడివడిగావచ్చు చుండెను.

పాపమామె శరీరం వణకిపోయింది. ఆమె మహాభయంతో నన్ను కౌగలించుకొని—

అనసూయమ్మా! అని బోరున ఏడవడం మొదలెట్టింది.

ఇంతలో వీధిలోనున్న బళ్ళమనుష్యులు కంగారుగా లోనికివచ్చి అప్పలమ్మదగ్గరకువచ్చుచున్న నాభర్తను వారించి ఆయన దగ్గరనున్న సైజారును తీసుకున్నారు.

అనంతరం నాభర్త ఆజ్ఞనుపొంది ఆబళ్ళమనుష్యులు మా యింటియందు జొరబడి ఇంటియందున్న గిన్నెలూ—చెంబులూ ఒక్క టేమిటి ఇంటియందున్న పాత్రసామానుల నన్నింటిని మచ్చున కొక్క టియైననూ లేకుండగా వెదకి తీసుకొని వాటినిబళ్ళనిండా వేసుకున్నారు ఆబళ్ళను తోలించుకొని నాభర్త వెళ్ళిపోయెను.

ఇక ఆయింటిలో అప్పలమ్మా నిద్రించుచున్న చంద్రుడూ నేనూ తప్ప యిక ఎవ్వరునూ లేరు.

వారు వెళ్ళిన రెండుగంటలకు తెల్లవారింది.

నాభర్త కొట్టినదెబ్బ పెద్దగాయముగామారి నాకు అపరిమిత మయిన బాధకలిగింది. ఆబాధ భరించలేకపోయేదాన్ని అరుంధతమ్మా నా నాధుని యెడబాటునకు లోలోనదుఃఖించుకొని ప్రాణముగోల్పోవ నిశ్చయించుకొనేదాన్ని నా ఆఖరునిశ్చయమునకు అంతరాయము కలిగె డిది. నాచంద్రుడు జ్ఞప్తికివచ్చి—నామనస్సులో అపరిమితమయినబాధ జనించింది.

నాముద్దుబిడ్డడను విడనాడుటకు మనస్సు అంగీకరించలేదు. నామనస్సులో పిచ్చిపిచ్చి యూహాలు జనించి నాప్రాణములపై ఆశ కలుగజేసినవి.

అప్పలమ్మ నాగాయమును చూచినప్పుడల్లా విచారించేది. అప్పలమ్మ నాగాయమునకు అనేకమందులువేసి ఆఖరికి గాయమును మాన్పింది. భర్తసేవ, ప్రాప్తిలేని, నాజన్మను, నాలోనేను నిందించు కునేదాన్ని.

నాదుఃఖజీవితమునకు కొన్నిరోజులు గడచినవి. అప్పటికి నా భర్త నన్నువిడచి రెండు నెలలు కావచ్చెను.

ఆ రెండునెలల గ్రాసమునకూ—అప్పలమ్మ చేతిలో బంగారపు మురుగులు, అమ్మినడబ్బు సరిపోయింది. ఇక మా భుక్తికి మాదగ్గర ఒక్క—రాగిపైసా కూడా లేదు.

౩

ఆనాడు తెల్లవారి. పదిగంటలాయెను. నా చిన్నారితల్లి—

అమ్మా? నాకు ఆకలిగా, ఉంది అన్నంపెట్టవా? అనిఅడుగుతూ ఉంటే—

దుఃఖంతో గుండెలు బరువెక్కిపోయాయి. నాకళ్ళనుండి నీళ్ళు గిర్రున, తిరిగాయి. నాలో నేను దుఃఖించుకొన్నాను. దేముడా? అమాయకులమైన, మనుష్యులను, జాలియైనా లేక ఎన్ని ఇడుముల నిడుచుంటివి?—

నీబిడ్డలయిన మనుష్యులను ఇన్ని కష్టముల పాలుచేయుటకు హేతువేమి?

దయామయా? నిన్ను పెద్దలు దయామయుడవందురు. నీయందు దయనాకు కానరాకున్నది.

దయామయుడవని, నీకెవ్వరు పేరొసంగితిరి. బిరుదు? జగత్తునకునాయకుడవట—న్యాయాన్యాయములు లేని నీనాయకత్వమెందులకు? నీయందు కూడా పక్షపాతమున్నది. కనుకనే నిన్ను పాండవ పక్షపాతియని చెప్పుకొన్నారు.

భక్తులవలన అనంతకోట్ల బిరుదులను పొంది గర్వాంధుడ వయితివి.

లోభత్వమనుసదియూ నీదగ్గరనే యున్నది. అంతులేని ఉదారో రసమును నీదగ్గర దాసుకొని నాయట్టి నిర్భాగ్యురాలపై దయారస ముతో కూడిన చూపులను ప్రసరింప జేయుటకు లోభించుచుంటివి.

నాహృదయ వేదన భరింపలేక దేవుని నిందించితిని.

నాముద్దుబిడ్డకు ఆకలి బాధ భరింపలేక—

అమ్మా! అన్నంపెట్టవూ?

అని ఏడ్చుచుండెను.

నాలో నాకు అపరిమితమయిన బాధ కలిగింది.

ఏడ్చుచున్న నాముద్దుబిడ్డని కళ్ళంట వచ్చేనీళ్ళను— నాపయిట చెంగుతో తుడిచి ఎత్తుకున్నాను.

అప్పటికి ఒంటిగంటాయెను. పొద్దుట ఎనిమిది గంటలకు వెళ్ళిన అప్పలమ్మ అప్పటికింకనూ రాలేదు.

అప్పలమ్మ మమ్మల్ని గురించిపడే కష్టాలన్నీ—మనస్సులో తలంచుకొని విచారిస్తు—

చంద్రిని భుజంమీద వేసుకొని మావసారాలో అటూఇటూ తచ్చాడుతున్నాను.

ఇంతలో అప్పలమ్మ నాదగరకొచ్చి నన్నుచూచి—

'అలసూయమ్మా? పొద్దుపోయిందమ్మా?' అని తనపయిట చెంగులో యున్నబియ్యాన్ని ఓచేటలో పోసి—నాదగ్గరయున్న చంద్రిణ్ణి ఎత్తుకొని చంద్రికి చిన్నమిఠాయిపొట్లా ఇచ్చింది.

ఆచేటలోపోసినబియ్యం నేనుకొలవగా —మూడుతవ్వలసోలడు బియ్యమున్నవి.

ఈబియ్యము అప్పలమ్మ ఎలాతెచ్చిందా యని మనస్సులో అనుకున్నాను. ఆబియ్యములో కొన్నిబియ్యం తీసుకొని వంట తయారు చేసుకొని—మేము ముగ్గురమూ భుజించేము.

అనంతరం అప్పలమ్మను—

'అప్పలమ్మా? ఈబియ్యం నీకెట్లు లభ్యమయ్యెను.' అని నేను అడగ్గా—

'అనసూయమ్మా?' నేను పొద్దుట ఇచ్చట బయలుదేరి మా యింటిదగ్గరకు వెళ్ళెను. అక్కడనున్న ఇరుగుపొరుగు వాళ్ళను కొంత మందిని ఒకరూపాయి అప్పివ్వమని అడగ్గా—

వాళ్ళు నాకు ఒక్కపాలాడబ్బులుకూడా ఇవ్వలేదు!

నీకు మేము అప్పిస్తే ఎలా తీరుస్తావు? అని హేళనచేసేరు. నాకే మియూ తోచిందికాదు.

భగవానుడా! నీవేదిక్కని అచ్చటనేయున్న నాచిన్నిగుడిసె లోనికెళ్ళి కూర్చున్నాను.

అప్పటికప్పుడే—వేళ తిరిగిపోయింది. వట్టిచేతులతో ఇక్కడకు రావడానికి నామనస్సు అంగీకరించడంలేదు. ఇంతలో ఒకయువకుడు— తనభుజంమీద కావడివైచుకుని ఇసుము కొంటావని పెద్ద, పెద్ద కేకలు వేయుచూ—నాగుడిసె ముందునుంచే వెళ్ళుచుండెను.

అతడినిచూచి—

'బాబూ? ఇలారా' అనిపిలవగా అతడు నాదగ్గరకొచ్చి—

'మామ్మా? ఇసుముందా?' అమ్ముతావా? అని నిలవబడ్డాడు.

వెంటనే నేను లేచి నాగుడిసెలో నెత్తగా—ఓమూలనాకు కొంత తుప్పుపట్టిన ఇసుముకనుపించింది. సంతోషముతో ఆఇనుము ఆయువకుని కివ్వగా అతడా ఇనుముతూచి—

'మామ్మా? నాలుగువీసెల ఇనుమిది.' అని వీసెకు నాలుగణాలు చొప్పున, నాలుగువీసెలకూ నాకొకరూపాయినిచ్చిఅతడు వెళ్ళిపోయెను.

ఆరూపాయిపట్టుకొని బియ్యపుకొట్టుదగ్గరకు, వెళ్ళి—ఒక అర్థ రూపాయిబియ్యము తీసుకొని బియ్యపుకొట్టువద్దరగానున్న మిఠాయి

దుకాణందగ్గర రెండుకాసుల మీఠాయి మనచంద్రునికి తీసుకొని ఇకమిగిలినడబ్బులు పట్టుకొని పొద్దుపోయినందుకు పశ్చాత్తాపపడుచూ వడివడిగా వచ్చాను. అని చెప్పింది.

అప్పలమ్మకు మాయందున్న విశ్వాసాన్ని పలుమారులు తలచుకున్నాను.

అప్పటికి సాయంకాలమయ్యేను. కొంచెము కిరసనాయిలుండగా దీపం వెలిగించి చావడిలో పెట్టి—

కునికిపాట్లు పడుచున్న మాచంద్రుని పరుండబెట్టి మరల అప్పలమ్మ దగ్గరకువచ్చి కూర్చుని—

అప్పలమ్మా? మీ ఆనందబాబయ్యగార్ని గురించి తెలుసుకున్నావా?

అనసూయమ్మా? మా ఆనందబాబయ్యగార్ని గురించి నేనిదివరకే తెలుసుకున్నాను. ఆయననుగురించి మీకు చెప్పడానికి యెప్పటికప్పుడే నామనస్సు అంగీకరించింది కాదు. ఇక ఇప్పుడు చెప్పక తప్పదు—

ఆయనకు ఇదివరకున్న ఇప్పుడు తాగుడు ఎక్కువయిందనిన్నీ తాను ఉంచుకొన్న వేశ్య మాయలోబడి వివేకం లేకుండా, దుర్మార్గమయిన కార్యములను ఆచరిస్తూ తన డబ్బును ఆవేశ్యకు కొల్లకొల్లగా అర్పిస్తూ సర్వకాలసర్వావస్థలయందునూ, బ్రాందీ మొదలయిన మత్తుపానీయములకు లోబడి—

మన ఈవిశాలనగరములో ఉన్న రౌడీలకు తనడబ్బు ఖర్చుపెడుతూ పానపిశాచమునకు తనజ్ఞానమును అర్పించి వేశ్యమాట జవదాటక ఆవేశ్య వలపుయనే వలలో దగుల్కొని—

నిందాస్పదమయిన, కార్యములను గావిస్తూ తనజీవితమును గడుపుచుండెనని తెలుసుకొన్నాను.

అని అప్పలమ్మ నాతో చెప్పగా—

నా హృదయమునుండి, నిట్టూర్పొక్కటి వెలువడినది.

అప్పలమ్మా!? బ్రహ్మదేవుడు మహా దుర్మార్గుడు—

అందువలననే ఆ వేలుపునకు ఆలయములనుకట్టి ఎవ్వరునూ—పూజింపరయిరి.

ఓ విధాతా? ఏమి సృష్టిరాసీది? నీతల్లిదండ్రులయినను—నీకు జ్ఞానము బోధించి నిన్ను సన్మార్గునిగా చేయ లేదూ?—

నీ తెలివి తగులబెట్టా పతివ్రతలనయినను తమ దుర్మార్గపు చూపులచే జూచి—ఆ పతివ్రతామతెలులను, మోసము జేయు, సంకించు, మహా దుర్మార్గులను సృష్టించితివి.

భార్యలనుండి భర్తలను, విడదీసి—సతులకు, ప్రాణనాథుల పాదసేవ ప్రాప్తి లేకుండగా జేసి, సత్పురుషులయినను తమమాయలకు లోబరగా జేసుకొని—వారిచే కానికృత్యములను జేయించుకొనుచూ—

నారీ ఇల్లాండ్రను దుఃఖింపజేసెడి—మహా దుర్మార్గులయిన స్త్రీ పిశాచములను సృష్టించితివి—అని—

'అప్పలమ్మా? బ్రహ్మదేవుని సృష్టిపద్ధతి ఇలా ఉంది యని అప్పలమ్మతో—నేనసగా—

ఇంతలో వీధితలుపుతట్టి ఎవరో—

'అనసూయగారూ!' అని పిలిచెను.

'అప్పలమ్మా?' నన్నెవరో— పిలుస్తున్నట్టున్నారు చూడు—అని అప్పలమ్మతో—నేననగా—

అప్పలమ్మ లేచి వెళ్ళి వీధితలుపులు తీసింది.

పదునాల్గు సంవత్సరాల కుర్రాడొకడు—

'మామ్మా?' ఈ ఇల్లు ఆనందరావుగారిదేనా అని ప్రశ్నించెను.

"ఆ, ఆనందరావుగారిదే, ఈ ఇల్లు అని అప్పలమ్మ సమాధాన మిచ్చింది.

'ఏమమ్మా?' ఈకవరు ఆనందరావుగారు — అనసూయగారికి ఇవ్వమన్నారు—అని జేబులోయున్న కవరుతీసి ఆక్కరాము, అప్పలమ్మ కిచ్చి—వెళ్ళిపోయెను.

మరల అప్పలమ్మ ఆవాలు పోపువేసి—ఆకవరు తెచ్చి నాకిచ్చింది.

ఆకవరుచింపి అందున్న కాగితమును తీసుకొని—యిట్లు చదువుకొంటిని—

ఏయ్? అనసూయా?

నీకు తెలియజేయునదేమన నేను—నాయింటిని అమ్ముకున్నాను. ఆయిల్లుకొనుక్కొన్నవ్యక్తి ఉదయముననేవచ్చి— యిల్లు స్వాధీనంచేసుకుంటాడు. గాన నీవీఉత్తరం చూచి—తక్షణం, ఈయిల్లువిడచి ఎక్కడికైనా వెళ్ళిపోవాలి. తక్షణమే—వెళ్ళిపోయిన నీకేలాభం.

ఇట్లు—
ఆనందరావు.

అని ఆఉత్తరం చదువుకున్నాను. నాహృదయమున భయాగ్ని రగుల్కొని నన్ను దహించింది.

నామతి చంచలమైంది. నానాథుని పాదములకు—సాష్టాంగ నమస్కారములిడి, బ్రతిమాలుకోవాలని నాకుతోచింది.

'అనసూయా?' నీనాథుని నీవుబ్రతిమాలుకొన్ననూ నీపై కనికరముకలుగుట కల్లయని ఎవరో చెప్పినట్లాయెను. నాకళ్ళనుండి వచ్చుచున్న విషాదజలమును—తన పయిటచెంగుతో తుడుస్తు—

'అనసూయమ్మా విచారించకు' అని తనకళ్ళంటనీళ్ళు వదులుతూ అప్పలమ్మ నన్ను బ్రతిమాలింది

'అరుంధతమ్మా నాలో నేను యెంతధైర్యం చెప్పుకున్ననూ నా భర్త జ్ఞప్తికివచ్చినప్పుడల్లా—నాధైర్యం నీరుగామారి ఇకనాలో నుండకుండా ఎక్కడికో పోయ్యేడిది.

అప్పలమ్మ నాకు ధైర్యంచెప్పి నన్ను ఊరడించింది.

ఇంతలో నాతమ్ముడు సత్యం 'అక్కా తలుపుతీయుము' అని బిగ్గరగా పిలిచినాడు.

ఆదీనావస్థలోనున్న నాకు నాతమ్మునిమాట వినబడడంతోనే నాకుధైర్యం కలిగింది.

వెంటనే నేనులేచి అదురదాగా వీధితలుపులనుతీయగా — నా తమ్ముడు లోనికివచ్చి నన్నుజూచి—

'అక్కా! అలాఉన్నావేం'అని ఆశ్చర్యంగా అన్నాడు.

నాతమ్మునితో నాదీనావస్థ ఒక్కసారిగా చెప్పుకోవాలనుకున్నానుగాని—

దుఃఖముతో నాగుండెలు బరువెక్కి నాహృదయమునుండి మాట వెలువడినది కాదు.

నాదీనావస్థకుకారణమేమో అని నాతమ్ముడు కంగారుపడ్డాడు.

అప్పలమ్మ ఓకుర్చితెచ్చి తమ్మునికి కూర్చోమని వేయగా—

నాతమ్ముడు ఆకుర్చీలోకూర్చొని—

'అక్కా'అని నన్ను పలుకరించాడు.

నాతమ్మునికి నాజీవితగాథను దుఃఖపూరితమయినకంఠముతో చెప్పుకున్నాను.

నాగాథవిని నాతమ్ముడు విచారించాడు. ఆసమయమున నా తమ్మునికళ్ళనుండి రెండోమూడో కన్నీటిచుక్కలు భూమిపై పడినవి.

"అక్కా బావనూ నిన్నూ అమ్మ తీసుకురమ్మని నన్ను పంపింది అని నాతమ్ముడు నాతో అనగా—

నాదుఃఖము పొంగిపొర్లిపోయింది.

నాతమ్ముడు అప్పలమ్మతో—

'అప్పలమ్మా! మా బావ ఉంచుకున్న వేశ్యఇల్లు ఎక్కడో నీకు తెలుసా' అని అడగ్గా—

'ఆ తెలుసండి. ఆమె పేరు కళావతి. ఈ విశాలనగరంలో మెయిన్ రోడ్డుకు చేరియున్న ఆనంద సినిమాహాలుదగ్గరకు వెళ్ళి ఆ హాలునకు దక్షిణ వయిపున ఉన్న వీధి వెంబడే వెళ్ళిన కళావతిమేడ మీకు కనబడును ఆ మేడ రెండుఅంతస్తుల మేడ—ఆ వీధి చిన్నవీధి, ఆ వీధిని కళావతికి తప్ప ఇక రెండంతస్తుల మేడ ఎవ్వరికినీ లేదు. ఆ వీధికి వీధంతా వేశ్యలకొంపలే బాబు' అని అప్పలమ్మ నాతమ్మునితో చెప్పగా

వెంటనే నాతమ్ముడు లేచి—

'అక్కా— ఆలస్యముకూడా ఎంతో అనవసరం. బావదగ్గరకు వెళ్ళి బావను తీసుకొస్తాను' అని నాతో చెప్పి బావను తీసుకురావడానికి తక్షణం బయలుదేరి వెళ్ళెను.

'అప్పలమ్మా! నాతమ్ముడు తనబావగారిని బ్రతిమాలుకుంటే ఆయన ఒప్పుకోరా? ఆయన ఒప్పుకోనియెడల 'అక్కా— మా బావను పదిరోజులవరకు ఉంచుకొని మరల పంపేస్తాం' అని కళావతిని నాతమ్ముడు బ్రతిమాలుకుంటే ఆమెకు దయకలిగి—నానాధుని పంపదూ?

ఆమె నానాధుని పంపుటకు సమర్థురాలు. ఆ వేశ్య చెప్పినప్రకారం నానాధుడు తప్పక నడుచుకొనును—

'అప్పలమ్మా! ఆ కళావతి నాతమ్మునితో నానాధుని తప్పకుండా పంపును' అని అప్పలమ్మతో వెర్రిదానివలె అనగా—

అప్పలమ్మ నావయిపున జాలితో కూడుకొనియున్న చూపులను చూచింది.

మరలనాకు నిరాశ జనించింది.

అరుంధతమ్మా! అప్పటికి నాతమ్ముడు వెళ్ళి చాలాసమయమయింది అప్పటికింకనూ నాతమ్ముడు రానందుకు నాలోనేను కంగారుపడ్డాను.

అప్పలమ్మా నాతమ్ముడు ఇంకనూ రాలేదే అని అప్పలమ్మతో నేననగా—

మిరేనమ్మా ఈపాటికి రావలసింది అని అప్పలమ్మకూడాఅంది.

అప్పటికి సగంరాత్రి గతించింది. ఇంతలో—

'అక్కా తలుపుతియ్యి' అని నాతమ్ముడు దీనంగా పిలిచెను.

నాతమ్ముని దీనావస్థకు కారణమేమాయని తత్తరపడి దిగ్గున లేచివెళ్ళి తలుపుతీయుగా—

నాతమ్ముడు లోనికివచ్చెను.

అప్పటిదృశ్యము నేనుచూడ లేకపోయాను. నాతమ్మునితలనుండి వచ్చుచున్న రక్తమును చూడడంతోనే నాకళ్ళుగిఱ్ఱున తిరిగిపోయాయి.

నానోటినుండి మాట వెలువడినది కాదు. నాకు స్మృతితప్పి పోయి కెవ్వున కేకవేసి భూమిపై పడిపోయాను.

అప్పలమ్మా నాతమ్ముడూ నన్ను లేవదీసి నాకు కొంచం మంచినీళ్ళు పట్టించారు. నాశరీరం విడిచి, వెళ్ళిపోయిన ప్రాణాలు మళ్ళావచ్చి చేరుకొన్నాయి. నాతమ్మునిజూచి భోరున ఏడ్చేను. నా తమ్ముడు ఏడ్చుచున్న నన్నుజూచి—

'అక్కా' విచారించకు, ఎట్టి వ్యక్తులకయినను—కష్టము లొచ్చుచుండును. నీవు పతివ్రతవు. నిన్ను నీభర్త తప్పకుండా చేరు కుంటాడు. పతివ్రతవయిన నిన్ను నీభర్త ఎందుకు చేరుకోడో చూద్దాం—

నీ మనస్సులో విచారం పెట్టుకొని నీశరీరారోగ్యం పాడుచేసు కోకు. అని నాతమ్ముడు నాకు అనేకవిధములుగా ధైర్యం చెప్పి—

'అక్కా?' నేను బయల్దేర కళావతిఇంటికి వెళ్ళేను. ఆమె ఇంటి దగ్గర కావలేను.

వెంటనే నేను తిరిగి మరల ఆనందసినీమా హాలుదగ్గరకొచ్చి అక్కడ కొంతమందిని, బావనుగురించి అడగ్గా— వాళ్ళు మాకేమీ తెలియదన్నారు.

ఇంతలో ఎక్కన్నుంచో—ఆ సినీమా హాలుదగ్గరకు చిన్న మోటారువచ్చి ఆగింది. ఆకారునుండి డ్రైవరు మాత్రమేదిగి, ఆ పక్కగావున్న బాంరుదిపాపులోనికి వెళ్ళెను. ఇక ఆ మోటారులో ఇద్దరువ్యక్తులు మాత్రమున్నారు. వారిరువురూ—హిందీని మాట్లాడు కొంటున్నారు. ఆ కారులోవున్న ఒక మనిషిమాట బావమాటవలెనే వినిపించింది నాకు.

వడివడిగా ఆ కారుదగ్గరకు వెళ్ళిచూడగా—

ఆ కారులో నాకు బావ కనుపించెను.

బావ కనుపించిగానే— నాకు, అపరిమితమయిన సంతోషం కలిగింది.

'బావా! బావా? యని—బావను పలకరించగా—

బావ నావయిపుకుచూచి— మహాకోపంతో, కళ్ళెర్రజేసి— బా వెందుకురా నీకు? బావను బ్రతిమాలన్నకొచ్చావా? అని పళ్ళుపట పటా—కొరుకుతూ—

బావ ఆకారులోవున్న ఓ రెంచి తీసి కారునుండి ఇవతల కొచ్చి—

బావ తన బలంకొద్దీ—ఆ రెంచి తీసుకొని నన్ను కొట్టగా—ఆ దెబ్బ నాశిరస్సుమీద గాఢంగా, తగిలి స్మృతితప్పి, పడిపోయాను.

సోడాలు, అమ్ముకునే ఓ కుర్రాడు నన్ను లేవదీసి, నాకొక సోడా పట్టించి, నాతలనుండి వచ్చుచున్న—రక్తమునకు ఒక తడిగుడ్డ చుట్టి నామోమున పట్టిన చెమటను తనరుమాలుతో తుడిచెను.

'అక్కా—?' అప్పటికి, నాకు జ్ఞప్తి వచ్చింది.

అక్కడ బావ ఉన్నాడేమో యని చూడగా—బావ లేడు. బావ ఆమోటారుమీదే, అప్పుడే వెళ్ళిపోయాడు.

ఆ సోడాలు అమ్మేకుర్రాడు—

'ఏమండీ!' ఆనందరావుగారు, మీకేమవుతారు? అని అడగ్గా—

ఆనందరావుగారు మా బావే—అని సమాధాన మిచ్చాను. ఇంతలో కొంతమంది, కానిస్టేబులు వచ్చి నాచుట్టూమూగి నిన్నుకొట్టిన వ్యక్తి ఎవరో—చెప్పమని, నన్ను బలవంతం పెట్టగా—

'నన్నెవరూ — కొట్టలేదు.' అని వారికి, నేను సమాధాన మిచ్చాను.

నిన్నెవరూ—కొట్టనియెడల, నీకా దెబ్బెందుకు తగిలింది?

నడుస్తూ, నడుస్తూ—తూలిపోయి, పడిపోయాను.

తాగి—తూలిపోయి, పడిపోయావా? అని నన్ను హేళన చేస్తూ— ఆ కనిస్టేబులు వెళ్ళిపోయారు.

ఆ సోడాలు, అమ్ముకునే కుర్రాడుమాత్రం నాదగ్గరనే నిలబడి—

'ఏమండీ!' మీ దేవూరు? అని నన్ను అడగ్గా—

'మాది మధురాపురం' అని సమాధాన మిచ్చాను.

ఈ విశాలనగరానికి, మీ మధురాపురం ఎంతదూరముం టుంది?—తమ పేరేమి? అని మరల ఆ జోడాలు అమ్ముకునే, కుర్రాడు అడగ్గా—

ఈ విశాలనగరానికి—మా మధురాపురం, ముప్పదిరెండు మైళ్ళు, నాలుగు ఫర్లాంగుల దూరముండును. నాపేరు సత్యం అని చెప్పి, ఆ కుర్రాడిపేరు నేను కనుక్కోగా—

నాపేరు బాబూరావండి—నేను కిష్టకుర్రాడ్ని—అని బాబూరావునాకు, సమాధాన మిచ్చాడు.

అక్కా! బాబూరావు చాలా మంచివాడు. నాతో స్నేహితుడైపోయినవ్వాడు—

తన తుమాలనుచించి నాకాళ్ళకు, కట్టుకట్టాడు.

బాబూరావునకు పదునాలుగు సంవత్సరములుండును.

బాబూరావు మనస్సు, చాలా మంచిది. అతడు ధరించుకొన్న వస్త్రములు, చినిగిపోయి మలినముగా ఉన్నవి.

బాబూరావు దరిద్రావస్థలో, నున్నట్టునాకు తోచింది. నా మనస్సుబాధపడింది. దరిద్రావస్థలో నున్న బాబూరావుకి, సహాయం చెయ్యాలని నామనస్సు తొందరపడింది. నా జేబులోనున్న ఫరనుసుండి, పదిరూపాయలనోటు నొకటితీసి—

బాబూరావుకి యివ్వగా—

బాబూరావు ఆనోటుతీసుకుని—మహానందంతో—నాకునమ స్కరించి—నాదగ్గర సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. అనంతరం నేనొక, గుఱ్ఱపుబండిమీద యిక్కడకువచ్చాను. ఇప్పుడా గుఱ్ఱపుబండీ మన వీధిలోనే నిలవబడియున్నది. అని—మాసత్యం నాతో అనేసరికి—వీధిలో నున్న బండిమనిషి—

"ఏమండో సత్యంగారూ!! మధురాపురంవెళ్ళే పాసింజరు బండి ఇంకో అరగంటకు స్టేషన్‌కి వచ్చేస్తాది—అని తొందరచేయగా—

'అక్కా—?' యింకో అరగంటకు—మధురాపురం వెళ్ళేబండి వస్తాది. మనం తొందరగా వెళితేనేగాని బండిదొరకదు' అని అప్ప లమ్మనూ నన్నూ తొందరపెట్టి—నిద్రపోయేతనమేల్లుణ్ణి లేపి—ఎత్తుకొని బండాసామీని పిలిచి—నాట్రంకుపెట్టి — సూట్కేసునూ ఆబండిలో వేయించాడు.

తరువాత నాతమ్ముడూ—నేనూ—చంద్రుడూ —అప్పలమ్మా— కలిసి ఆగుఱ్ఱపుబండి ఎక్కగా—

బండివాడు, మమ్మల్ని, విశాలనగరం స్టేషనులో దింపి తనబండి రేటును తీసుకొని వెళ్ళిపోయాడు.

యింతలో మధురాపురంవెళ్ళే పాసింజరు వచ్చిఆగ్గా మేమూ బండెక్కి—మన మధురాపురం వచ్చాము.

"అరుందతమ్మా?' యిదీ నాజీవితగాధ. యిక నాజీవితగాధ ఎట్లు మారనున్నదో

అనసూయ చెప్పినగాధనంతటినీ— అరుందతివిని. అనసూయకు తనపతియందున్న ప్రేమను తనలోతాను గొనియాడుచూ—

'అనసూయా?' అప్పలమ్మ యిప్పు డెక్కడుంది?'

'నాభర్త క్షేమం తెలుసుకురమ్మని అప్పలమ్మను, విశాలనగరం పంపాను.

'అనసూయా?!' నీవు బెంగపెట్టుకొని — నీశరీరారోగ్యం పాడు చేసుకోకు, ఇక భవిష్యత్తు ఎట్లు జరుగనున్నదో—అట్లు జరుగక మానదు-

'నేను మళ్లీ నిన్ను కలుసుకుంటాను.' అని అనసూయదగ్గర సెలవుతీసుకొని— అరుందతి వెళ్ళిపోయింది.

---

౪

కళావతీ! ఆఖరికి నువ్వు డబ్బంతా వాడితాగుడుకింద ఖర్చుపెట్టి బిక్షమెత్తుకుంటావా? అబ్బబ్బా! నీకు చెప్పడానికి నా ప్రాణం విసిగిపోతుంది. ఆదిక్కుమాలాడ్ని గుమ్మంయెక్కనివ్వకే అని నీకు చెబుతూ ఉంటే—నీకు వినిపించనయినా వినిపించడంలేదు.

క్షమగాచూడు — నామాటలింటే — నువ్వు బాగుపడతావు ఆ ఆనందగాడిదగ్గర బుగ్గిగొరిగించుకోవాలన్నా ఒక్కపాగికబ్బు లేదు. ఆవెధవను అస్తమానమూ పీక్కతగిలించుకొని వాడితోనే కాలక్షేపం చేస్తావు.

నిన్నచూశావా! ఆశెట్టిగారు ఒక్కరాత్రికి ముప్పయిరూపాయిలూ ఘుళ్ళునపోసి వెళ్ళేడు.

ఆయనవెళ్ళిపోయేటప్పుడు నాతో ఏమన్నాడో తెలుసా? నీకూతురువిషయాలన్నీ మంచివేగాని—ఆకొడీముండాకొడుకుని విడిచిపెట్టించేద్దువా నీకూతురు బాగుపడిందనుకో — ఆ శనిగ్రహాన్నిగురించి నేను రావడానికి జంకుతున్నాను అని చెప్పి వెళ్ళిపోయాడు.

నువ్వా శనిగ్రహాన్ని వదల్చుకున్నావంటే—షరాబులు అనేకమంది డబ్బుగుప్పివేయడానికి చూస్తున్నారు. ఆ శనిగ్రహంమూలాన్ని నీదగ్గరకు కొంతమంది రావడానికి జడుస్తున్నారు.

అమ్మా నేచెప్పేది నీబాగుకోసంగాని — నాబాగుకోసంకాదు. నాకు తీరవలసినవన్నీ తీరిపోయాయి. నాకే యారాటమంతా నిన్నుగురించేగాని నాక్షేమంకోసంకాదు. నేనెందుకుచెబుతున్నానో నువ్వు

బాగా ఆలోచించుకో ఇప్పటికింకా నీకు ఆవగింజలో అరవగంకాలు కూడా తెల్వ లేదు.

నీకు ఇల్లాంటివిషయాల్లో అనుభవంతక్కువ. అన్నిసందర్భాల లోనూ ఆరితేరి వయస్సు తీరిపోయిన పెద్దదాన్ని—

నేనెందుకు చెప్తున్నానో నామాటయందలి విశ్వాసముంచి నేనుచెప్పినప్రకారం నడచుకొందువా నువ్వుబాగుపడతావు.

ఇప్పటికింకా మనకులవృత్తిలోఉండేసంగతులునీకు తెలియే లేదు. మనశరీరంకాస్త బిగువుగాఉన్నప్పుడే మనం ఎంతమందిని దివాళాలు చేసి డబ్బుసంపాదించిననూ—

అంతేగాని మనశరీరబిగువుకాస్తా తగ్గిందంటే మనల్ని ఎవ్వరూ చూడరు.

అమ్మా నామాటవిని—

ఆశనిగ్రహాన్ని వదల్చుకో అని కళావతితల్లి కూతురుకిచెప్పటం ముగించగా—

'అమ్మా!'' నీదంతా చాదస్తం, నేనుమాత్రం నీకూతుర్ని కాదూ? నేనుమాత్రం తెలివితక్కువదాన్నా?'

ఆ ఆనందరావుని మాయలోవేసుకొని యిప్పటికి సరిగా రెండు సంవత్సరాలయింది.

అ ఆనందరావు నన్ను తగుల్కొన్న రెండునెలలకు నావలపు మందు నెత్తికెక్కించాను.

ఇంకో నెలకు భార్యనుకూడా విడిచిపెట్టించాను. ఈ రెండు సంవత్సరాల్లోనూ—కుర్చీ, గిన్నెలూ—చెంబులూ— అమ్మించాను. తనకు ఉన్న పదివేలరూపాయలఆస్తీ, అమ్మించి, ఆడబ్బంతా లాక్కున్నాను.

క్షౌరం చేయించుకోవాలంటే—అర్ధనాడబ్బులుకూడా లేకుండా చేసాను.

ఆనందరావుని ఈపాటికే గుమ్మం ఎక్కకుండాచేద్దును. అచిర కాలంలోనే అలాచేస్తే—

ఎంతవిశ్వాసంలేని జాతయినా మనకులంవాళ్ళే మనల్ని ఆక్షేపింతారని జంకుతున్నాను.

అంతేగాని, ఆనందరావుని ఒక్కక్షణంలోఅవతలకు తోలేస్తాను.

'కళావతీ! వట్టి పిచ్చిదానవునువ్వు—

రెండుసంవత్సరాల్లో—పదివేలరూపాయలు సంపాదించడం మహా గొప్పకాదు. నీమాటలుచూస్తే నాకు నవ్వొస్తోంది. ఈమహాభాగ్యానికి మనకులంవాళ్ళే—మనల్ని ఆక్షేపించడం! మనకులంవాళ్ళు మనల్ని ఎప్పుడూ ఆక్షేపించరు.

అలా ఆక్షేపిస్తే—వాళ్ళు మనకులంవాళ్ళెలా అవుతారు?'

'సరేలేఅమ్మా!'' ఆకాస్త అనుమానమూ తీరిపోయింది. ఇక ఆనందరావుని గుమ్మం ఎక్కనివ్వను.

'కళావతి! నువ్విలాఅంటే—నాకేమీ నమ్మకంలేదు.'

'కళావతి?' నీతోడు ఆనందరావును గుమ్మం ఎక్కనంజాచేస్తాను.

'అమ్మా? ఇప్పటికి నామనస్సు తృప్తిపడింది.'

'అమ్మా?" యిలా ఎవరో వస్తున్నట్లున్నారుచూడు—

అని కళావతి తల్లితో—అనగా—

'ఇంకెవరు అంత స్వాతంత్ర్యంగా రావడం, అడుగో ఆనందం గాడే—వీడికి పొద్దుకూకకుండానే పొద్దు కూకిందో - లేదో అప్పుడే వస్తూ—ఉన్నాడు.

నేనీ గదినుంచి వెళ్లిపోతాను. ఈవేళతో- ఈకళనిగ్రహాన్ని వదుల్చుకో—అని కూతురుతో చెప్పి కళావతితల్లి ఆగదినుండి వెళ్ళి పోయింది.

ఆగదినుండి కళావతితల్లి వెళ్ళగానే—

ఆనందరావు ఆగదిలోనికివచ్చి తనవంటిమీనున్న కోటుతీసి గోడకు నున్నకొయ్యకి తగిలించి కళావతికూర్చొనియున్న కుర్చీకియెదురుగాయున్న ఇంకొకకుర్చీమీద కూర్చుని—

'కళావతీ ఈవేళ అగ్గిపెట్టె తెచ్చుకోవడం మర్చిపోయాను. ఈబీడి దీపంతో అంటించిద్దూ.

నేను లేవలేను.

కారణం

నావంట్లో ఈవేళ బాగుండలేదు.

నీశరీరారోగ్యం చెడిపోయిందా?

ఆ చెడిపోయింది.

చెడిపోవడానికి కారణ మేమిటో!

కారణ మేమీ లేదు

ఆనందరావు వికటంగా నవ్వుతూ—

నీ ఆరోగ్యం చెడిపోవడానికి కారణం నాకు తెలుసు.

నిన్న పరాయివాడిచ్చిన అనేకవస్తోల్లు — నీ ఆరోగ్యం పాడుచేసి ఆఖరికి నిన్ను యమలోకం తీసుకుపోవడానికి సిద్ధంగా ఉన్నాయి.

నోట్లు యమలోకం తీసుకెళతాయా?

అన్నీను తీసుకెళతాయి. నిన్న నీకా డాక్టరిచ్చిన నోట్లువెన్ని.

అయిదేసిరూపాయలనోట్లు ఆరు.

ఆనోట్లు నీకెందుకిచ్చాడు.

నన్ను సరదాగా ఉమ్మని ఇచ్చాడట.

నువ్వు ఎప్పుడొస్తుంటావని ఇచ్చాడేం?

నేనువప్పుకుంటేనే ఇస్తా—అని జంకకుండా అన్నది.

ఆమాటకి ఆనందరావుకువచ్చినకోపం అద్భుతం. ఆనందరావు కళ్ళుఎర్రబడి చింతనిప్పుల్లా గయ్యాయి. ఆనందరావు మహాకోపంలో.

నాహృదయములోనున్న నువ్వు ఇంకోవ్యక్తికి ఎందుకొప్పుకున్నావు?

నీహృదయంలో నేను లేను.

నాహృదయంలో నువ్వు లేకుంటానే నావదివేలరూపాయలఆస్తి నీకు అర్పించేనన్నమాట.

నువ్వు అమితంగాత్రాగి, నాదగ్గర అనవసరప్రసంగం చెయ్యకు నీదగ్గరడబ్బున్నంతవరకూ నీహృదయములోఉన్నాను.

నీదగ్గరున్నడబ్బంతా అయిపోయింది. ఇక నేను నీహృదయంలో లేను. నాహృదయంలో నువ్వు ఉండటానికి వీల్లేదు.

కళావతి నిక్కచ్చిగా చెప్పినమాటలకు ఆనందరావు తెల్లబోయి కళావతిముఖం తీక్షణంగా చూస్తూ—

ఏమండీ? మీరంటే నాకు మహాప్రేమ, మీరు నాకు ఒక్క నిముషము కనబడనిమొనల నేనుండలేను.

దైవసాక్షిగా, మిమ్మల్ని నా మనస్ఫూర్తిగా ప్రేమించేను. మీరు నన్ను విడిచిపెడితే—ప్రాణత్యాగం చేసుకొంటాను. మన జీ

నీ ఇష్టదేవతను ప్రార్థించుకో నిన్ను జరూరుగా యమలోకం పంపాలి. అని గర్జించి పల్కగా—

కళావతి నిశ్చేష్టితురాలయి నోటినుండి మాటరాక కొయ్య బొమ్మలా, నిలబడి. వెర్రిదానిలాగున చూట్టం మొదలెట్టింది. ఇంతలో కళావతి తల్లి హఠాత్తుగావచ్చి తనకూతురు ఎదురు మృత్యుదేవుడులాగున నిలబడ్డ ఆ ఆనందరావు రెండుకళ్ళల్లోనూ తనచేతిలో యున్న కారం పోసేసింది. ఆనందరావు ఆ కారం కళ్ళల్లో పడుతుండగానే—కళ్ళు భగ్గున మండిపోయి—ఆమంటక్కు ఆగలేక భూమిపయిన దభాలున పడిపోయాడు.

'అమ్మా? మంచిపనిచేసేవే? క్రిందపడి మంటకాగలేక ఎలా కొట్టుకొంటున్నాడో చూడు—'అని కళావతి మహాసంతోషంగా అంది.

“అమ్మో? ఈ వెధవకు కళ్ళల్లో కారంపొయ్యకుండా విడిచిపెడతానా? నువ్వు కాళ్ళట్టుకో—నేను చేతులుపట్టుకుంటాను.’

అని తల్లీ—కూతురూ కలిసి ఆనందరావుని చెరోవయిపునా పట్టుకొని—అవతలపారేసి తలుపులు వేసుకొన్నారు. ఆచీకటిలో ఆరోడ్డు ప్రక్కను పాపం ఆనందరావు కారపుపోటు మంటకు—ఆగలేక గిజ గిజా తన్నుకొంటున్నాడు.

౫

'బండి ఆతోటాకు యింటిదగ్గర ఆపు.' అని బాబూరావు బండి వానితో చెప్పగా—బండితోలే ఆసామి బండిని ఆతోటాకు యింటిదగ్గర ఆపెను. ముందు బండిమండి బాబూరావుదిగి—

'ఆనందరావుగారూ? నెమ్మదిగా దిగండి.'అని బాబూరావనగా

'బాబూరావూ? ఈయిల్లేనా—మీది'' అని ఆనందరావు బండి నుండి దిగ్గా—

బాబూరావు తన జేబులోనున్న ఒక అర్ధరూపాయను తీసి బండి వానికిచ్చెను. బండివాడును బండితోలుకొని వెళ్ళిపోయెను.

'బాబూ! ఆనందరావుగారూ? ఈ మెట్లమీదనుంచి లోనికి రండి.' అని ఆనందరావుని లోనికి తీసుకెళ్ళి ఒకగదిలో ఒక పట్టిమంచంవేసి ఆమంచంమీద ఓ తెల్లని దుప్పటిపరచి—

'ఆనందరావుగారూ? ఆమంచంమీద పరుండండి 'అని బాబూరావనగా—

ఆనందరావు ఆపట్టిమంచంమీద కూర్చుని—

'బాబూరావూ! నువ్వు నాప్రాణం రక్షించేవు. నేను ఇప్పటి వరకూ—అక్కడనేయుంటే నాప్రాణాలు తప్పకుండాపోను. నువ్వు దేవుడులాగున అక్కడకొచ్చి—ఆమహా అవస్థలోనున్న నన్నుచూచి నాకళ్ళను చల్లని నీళ్ళతో, కడిగినన్ను కాపాడేవు నీఋణం నేను తీర్చుకోవడం మహాకష్టం.

ఆనందరావుగారూ! నేను ఆనందసినీమాహాలు దగ్గర ఎంత చేపటివరకూ—యుండేవాడ్నో మీకు తెలుసు. ఈవేళ నాకు వంట్లో బారికంగా ఉండి, పెందలాడే రావటం తటస్థించింది.

బాబూరావు! నీవలా నిలవబడే యున్నావు. ఈ మంచంమీద కూర్చో—

ఎందుకు? అవసరం లేదండీ నేను తుంగచాప వేసుకొని పరుంటాను. అని బాబూరావు ఓతుంగచాప వాల్చుకుని—పరున్నాడు.

బాబూరావూ! నా అనసూయా—చంద్రిదూ ఎక్కడున్నారో నీకు తెలుసా?

ఆ, తెలుసునండి. వారు మనపురంలోనే—ఉన్నారు.

బాబూరావూ! నేను మహాపాపి, సర్వకాలాల సర్వావస్థలయందునూ—త్యాగి జ్ఞానమును విడచి నా ఇల్లాలును అనేకకష్టాలుపెట్టేను.

నా అనసూయనూ నా చంద్రుడ్నీ నేను జూచుకొనేయెడల నా ప్రాణాలు, నిలబడవు. నేనొక పర్యాయం మా బావమరిదిని ఆనంద సినిమాహాలుదగ్గర తాగుడుమైకంలో ఉండి కొట్టగా—

అతడు పడిపోయాడు. అతడ్ని నీవు లేవదీసేవు. తక్షణం నేనా కారెక్కి వెళ్ళిపోయాను. నేను వెళ్ళిపోయిన తరువాత ఆ మహానుభావుడు—నన్ను నీ దగ్గర ఏమన్నాడు?

మీ బావమరిది మహా సుగుణుడు. ఆయన మిమ్మల్ని కొంచెం మాత్రంకూడా దూషించలేదు.

బాబూరావూ? నా అనసూయనూ— నా చంద్రుడ్నీ తీసుకొస్తావా? వారిని కూలిపని చేసుకొని పోషించుకొంటాను. నా భార్యను నేను కష్టపెట్టినందుకు గాను నేను అలా పోషించుకుంటే—నాకు ఇప్పటికి పెరిగిపోయిన ఈ పాపమంతా, నశిస్తాది. లేకపోతే — పొద్దుటనన్ను మధురాపురం, తీసుకెళ్లి నా చంద్రుడ్నీ నా అనసూయనూ— నాకు చూపిస్తావా?

నేను మా అత్తారికింటికెళితే—నన్ను మా బావమరిది రెంచుతీసుకొని కొట్టేస్తాడేమో! నా అనసూయ నన్ను చూచి—చెప్పడి, తన తమ్మునితో—నన్ను కొట్టమని చెబితే—

అతడు నన్ను తప్పకుండా, కొడతాడు. నా అనసూయను నేను బూటుకాలితో—తన్నినందుకు, చంద్రుడు నన్ను తిట్టడూ? నాకు మతిపోయిందని మా బావమరిది నన్ను చూచి—నవ్వుతాడేమో! ఎప్పుడూ నవ్వడు మా బావ చాలా మంచివాడు.

కళావతీ! నాకళ్ళల్లో, కారంజల్లి నవ్వుతున్నావా? మర్యాదస్థు రాలివా? నవ్వన్నవ్వు. ఎంతేమంది కొంపలో పాడుచేసి నువ్వు సంపాదించే ధనానికి, ధర్మమూ—అధర్మమూ ఉండాలా? ఆ కొధవముసిల్ది రేపో, మాపో తప్పక చచ్చిపోతాది. నిన్నూ నాలాంటి కాడుముండాకొడుకు, ఒక్కసరుకు సరికేస్తాడు. ఇకనువ్వు సంపాదించిన సొమ్మువాళ్ళో పట్టుకు పోతారు. అప్పుడుగాని నీరోగం కుదరదు.

ఓ మర్యాదస్థుల్లారా! నే చెప్పబోయేదివినండి. వెళ్ళిపోకండి నా యందు దయయుంచి అక్కడ కూర్చోండి. కూర్చున్నారా?— కూర్చు న్నామని ఒరిగిపోతున్నారా? మీరు తెలివయిన మహానుభావులు గనుక నేను రెండో—మూడో— మాటలు చెబుతాను. విని వెళ్ళి పోండి. నేను మీకు అంతగా చెప్పవలసిన అవసరంలేదు. కారణమేమి టంటారా? నేను కళావతిని గురించి పడేబాధలన్నీ— మీకళ్ళారా, చూట్టంలేదు గాన నావలె మీరునా—మీకళ్ళల్లో, కారంజల్లించు కొని చెడిపోకండి. ఈవేళకు నామనస్సు బాగుండలేదు గనుక మీరు తక్షణంలేచి వెళ్ళిపోండి.

బాబూరావ్! వీళ్ళను పంపేసేను. ఇకనీవు నాకు చేయవలసిన ఉపకారం ఉంది. ఏమిటా? నన్ను మధురాపురం అనసూయ దగ్గరకు తీసుకెళ్ళాలి

అని ఆనందరావు—బాబూరావుతో అనగా—అరే పాపం ఆనంద రావుగారికి మతిచంచలమయిపోయింది. అని తన మనస్సులో విచా రిస్తూ కంగారుగా లేచి, ఆనందరావు పరున్న పట్టిమంచం దగ్గరకు వెళ్ళి—

ఆనందరావుగారూ? పొద్దుటే మనమిద్దరమూ లేచి మధురాపురం వెళదాం. నాలుగురోజులక్రితం నాకు మధురాపురంలో చుట్టాలుండగా అక్కడికు నేను వెళ్ళేను. నన్ను మధురాపురంలో మీబావగారుమాచి—వారింటికి తీసుకెళ్ళేరు.

అక్కడ అనసూయమ్మగారు నాకు కనబడ్డారు.

అనసూయమ్మగారూ! నేనీవేళ విశాలనగరం వెళిపోతానండి. అని నేను చెప్పగా—

బాబూరావూ? ఆనందరావుగార్ని ఒక్కసారి తీసుకురావూ! అని ఆమెనన్ను ప్రాధేయపూర్వకంగా వేడుకోగా — తప్పకుండా తీసుకొస్తానమ్మా అని ఆమెకు సమాధానమిచ్చాను.

ఆనందరావుగారూ? తప్పకుండా పొద్దుట మనం మధురాపురం వెళదాం. ఇప్పటికే ఆలస్యమయి పోయింది. నిద్రించండి.

బాబూరావు? నిద్రపోతానుగాని, అనసూయకు నాయందు ఇంకా ప్రేముందా! నన్ను తీసుకురమ్మని నన్ను బ్రతిమాలిందా? నువ్వు మధురాపురంనుంచి వచ్చేటప్పుడు—మాచంద్రిన్ని చూశావా? నా అనసూయకు, నాయందు, మహాప్రేముందా? నాచంద్రుడ్ని నా అనసూయనూ—త్వరగా నేను చూడకపోయినట్లైతే నాప్రాణాలు నిలబడవు.

'ఆనందరావుగారూ! పొద్దుటే మనం మధురాపురం వెళ్ళిపోదాం నిద్రపోండి.

'బాబూరావూ! ఆశీర్వదిస్తాను. పొద్దుట మధురాపురం నీకా యుకంగా తీసుకెళ్ళాలి సుమా!?'

"ముమ్మాటికీ తీసుకెళతాను

'బాబూరావూ! సంతోషిస్తాను త్వరగా మాత్రం లేవు.'

'సరేలెండి.' అని బాబూరావు ఒప్పుకున్నాడు.

'తమ్ముడూ! బాబూరావు మీ బావను తీసుకొస్తానన్నాడు. యింతవరకూ తీసుకురాలేదు. నువ్వెళ్ళి మీ బావను బతిమాలి తీసుకురావూ?."

'అక్కా! బాబూరావు బావను తప్పకుండా తీసుకొస్తానన్నాడు. బాబూరావు ఈ వేళ బావను తీసుకురాని యెడల నేను పొద్దుట విశాల నగరం వెళతాను.

'తమ్ముడూ! నువ్వు విశాలనగరం వెళ్ళటమే కాదు బావను తప్పకుండా తీసుకురావాలి.

నా ఆఖరి నిశ్చయము నీకు నేను చెబుతున్నాను. భర్త ఉండియూ ఆయన పాదసేవ ప్రాప్తి లేని ఈ జన్మ ఎందులకు? ఈ నా దుఃఖజీవితము గడుపలేకన్నా ముగించుకొనెదను. నేను నీకు ఒక ఉత్తరం వ్రాసి ఇస్తాను.

ఉత్తరం తీసుకెళ్ళి మీ బావకిచ్చి—ఆయనను తీసుకురా? . అప్పటికి ఆయన రానియెడల ప్రాణత్యాగం చేసుకుంటాను. అని అనసూయ ఒక తెల్లని కాగితంమీద—

మహారాజశ్రీ రాజమాన్య రాజపూజితులయిన ఆనందరావు గార్కి— అగ్నిసాక్షిగా వివాహమాడిన మీ అనసూయ అనేకవేల సాష్టాంగ నమస్కారములిడి చేసుకునే మనవి. నేను నిర్దోషిని నన్ను మీరు విడిచిపెట్టి రెండు సంవత్సరాలయింది.

ఈ రెండు సంవత్సరాలూ— రెండుయుగాలుగా గడుపుకున్నాను. నా ఆఖరికోరిక మీరు నాకు కనబడనియెడల బలవన్మరణము పొందెదను.

ఇట్లు మీ ప్రేమదాసి అనసూయ.

అని వ్రాసి ఆకాగితం అనసూయ సత్యానికివ్వగా — సత్యం ఆకాగితం పుచ్చుకొన్నాడు.

అప్పటికి జాముచాత్రియింది. చంద్రుడు లయిటుదగ్గరకూచుని పాఠాలు చదువుకుంటున్నాడు.

యింకా వంటగదిలోనే—పొయ్యిమీద అప్పడాలుకాస్తూ—సీతా మహాదేవమ్మ కూర్చుంది.

'అక్కా—? యింకనూ అప్పలమ్మ విశాలనగరాన్నుంచి రాలేదు. కారణమేమిటో?' అని సత్యం అనసూయతో అనగా—

'ఈపాటికి అప్పలమ్మ రావలసిందే ఎందుచేత రాలేదో.' అని అనసూయ తన తమ్మునితో—అంది.

ఇంతలో వీధిగుమ్మంలో ఏదో బండి ఆగినచప్పుడయింది.

'అక్కా! మన వీధిగుమ్మందగ్గర ఏదో బండాగిన చప్పుడయి నది చూస్తానుండు.' అని సత్యం లేచి వీధిలోనికి వెళ్ళగా—వీధిగుమ్మంలో గుర్రపుబండి ఆగటంనిజమే అయింది. ఆబండినుండి దిగుచున్న బావ గారితో బాబూరావుని చూచి సత్యం ఆశ్చర్యపడ్డాడు.

లోన పాఠాలు చదువుకుంటూఉన్న చంద్రుడు—

'మామా! ఆబండెవరిదీ?' అంటూ—పరుగుపరుగున ఇవతలకు వచ్చాడు. చంద్రుణ్ణి చూడగానే—ఆనందరావుకి చలించిపోయినమతి మళ్లావచ్చి చేరుకొంది.

'నాన్నా! నువ్వేమి చదువుకొంటున్నావు?' అని ఆనందరావు చంద్రుడ్ని ఎత్తుకొని—తనకళ్ళంట ఆనందబాష్పాలు జలజల రాల్చేడు.

ఈదృశ్యంచూస్తూయున్న, అనసూయ మురిసిపోయింది. భర్త దగ్గరకు వడివడిగా వెళ్ళి—నమస్కరించి—భర్త కళ్ళనుండి వచ్చుచున్న ఆ నీటిబిందువులను తనపయిటచెంగుతో తుడిచింది.

ఆపౌర్ణమీ వెన్నెలలో వారిరువురూ ఒండొరులపయిని ప్రేమచూ ఫ్కులను ప్రసరింపజేసుకొన్నారు.

అప్పుడే విశాలనగరాన్నుంచి వచ్చిన అప్పలమ్మ ఆదృశ్యాన్ని చూచి పొందిన ఆనందానికి అంతులేదు. సీతామహా దేవమ్మ పరమానందంలో అల్లుణ్ణి కూతుర్ని దీవించుకొని లోనికి తీసుకెళ్ళింది.

స మా ప్త ము.



జె కస్లు ముద్రాక్షరశాల, రాజమండ్రి.